## రెండు మాటలు

అప్పుడప్పుడు ఆంధ్రజనత, గోలకొండ పత్రికలలో వ్రాసిన వ్యాసాలు, రేడియోలో చేసినప్రసంగాలు, సేకరించి, అందులో కొన్ని ముఖ్యమైన మార్పులు గావించి సంపుటీకరించినదీ గ్రంథము. ఇందుకు యీ పత్రికలకు, రేడియో వారికి నా కృతజ్ఞతలు. వ్యాసాలను సేకరించి, శుద్ధప్రతిని తయారు చేయుటలో తోడ్పడిన శ్రీ సాకేతరాజు గారికి కృతజ్ఞుడను.

ఆంధ్ర ప్రదేశ్ అవతరణ సందర్భమున తెలుగు పాఠక లోకానికి, యీ గ్రంథము సమర్పించుట జరుగుచున్నది.

పీఠిక వ్రాసిన మిత్రులు శ్రీ గడియారం రామకృష్ణశర్మ గారికి ధన్యవాదాలు.

1వ నవంబర్ 1956 } దుర్ముఖి, దీపావళి }

దేవులపల్లి
రామానుజరావు

# విషయసూచిక

## మున్నుడి

### తెలుగు శృంగారము



### ఆధునికాంధ్ర సాహిత్యము



### సాహితీ సమారాధకులు

# మున్నుడి

ఆధునికాంధ్ర సాహిత్యమున గద్య రచనకు ప్రధాన స్థానము కలదు. కాని నేటి యువ రచయితలలో తెలుగు వచన రచన నొక కళగా సాధించినవారు చాల తక్కువగ నున్నారు. అందును విమర్శనాక్షేత్రమున కృషి చేయుచున్నవారు అంత కంటెను అల్ప సంఖ్యాకులు. సాహిత్య విమర్శనకు సంస్కారముతో బాటు సరసత్వము, సంయమము చాల అవసరమైనవి. స్వాభావికముగ ఆవేశపు పాలెక్కువ కల తెలుగువారిలో కవులు కథకులు కుప్పతెప్పలుగ నున్నారు. ప్రాచ్యపాశ్చాత్య సాంప్రదాయములను, సాహిత్య రీతులను క్షుణ్ణముగ నెరిగి తెలుగులో విమర్శ సాహిత్యమునకు చక్కని రూపు రేఖలు దిద్ది తీర్చగల వారు నేటికిని వేళ్ళపై లెక్క పెట్ట దగిన స్థితిలో నుండుట గమనింపదగిన అంశము. తెలంగాణమున ఆంధ్రాంగ్ల సాహిత్య మర్యాదల నాకళించుకొని కవి ఆంతర్యమును, శాస్త్ర హృదయమును గుర్తించి మనోహర శైలిలో తెలుగు సాహిత్య విమర్శలు వెలయించుచున్నవారిలో మిత్రవర్యులు శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు ప్రథమ గణ్యులు.

ఉత్తమ రచయితగా, విమర్శకులుగా, పత్రికాధిపతిగా తెలుగు వచన రచనలోని మెళకువలను జీర్ణించుకొన్న విద్యా

వేత్తలు లోకజ్ఞులునగు శ్రీ రామానుజరావు గారు ఈ చిన్ని పొత్తములో తెలుగు కావ్యములలోని శృంగారము, ఆధుని కాంధ్ర సాహిత్య రీతులు, సాహిత్యారాధకులు అను వివిధ విషయములపై తాము వ్రాసిన కొన్ని వ్యాసములను కూర్చి నారు. ఇవన్నియును వారి విశిష్టశైలికి మచ్చుతునకలు.

తెలుగులో శృంగారప్రబంధములు లెక్కకు మెక్కులుగనున్నను ఉదాత్త శృంగార రసానుభవమునంది రచనలు చేసిన తెలుగు కవులు మిక్కిలి తక్కువ. ఇందుకు కారణము ఆనాటి పరిస్థితులు కావచ్చును. అనుభవమును బట్టి మనలో పలువురకు శృంగారమును గూర్చి సరియైన జ్ఞానము లేదనుట సాహసము కాదేమో! రసరాజమగు శృంగారముపై ఉదాత్త దృష్టిగల విద్వాంసుల అభిప్రాయముల నీసందర్భములలో గమనించుట సముచితము, "ఆనందమునకుగల అనేక రూపములలో సర్వ విదితమై, సర్వ సులభమై, సర్వ ప్రియమైనది శృంగారము, లేక స్త్రీ పురుషుల పరస్పరాకర్షణము. అదే సృష్టికి మూలశక్తి. ఉపనిషత్తులు దాని మహిమను వేనోళ్ళ కీర్తించుచున్నవి. దేవ ఋషిగాథ లందుకు దృష్టాంతములై యున్నవి. సర్వేశ్వరుని అనంతకోటి విలాసములలో నది నిత్యమై వెలయుచున్నది. శృంగారము ప్రపంచ ధర్మములలో నొకటి, తరులతాదులకు పుష్పమెట్టిదో స్త్రీ పురుషులకు శృంగార మట్టిది. పుష్పమును ధరించుటకు నాజూకుతనమవసరము. శృంగారముననుభవించుపట్టులనయసౌజన్యములు ముఖ్యములు. భగవదర్పితమైన పుష్పము పుణ్యము. భగవత్ప్రసాదముగ

అనుభవించు శృంగారము ధర్మము. పరమేశ్వర సంస్మరణ వలన సమస్త మానవ వ్యాపారములు పవిత్రవంతములగును. శృంగారోపాసనముగూడ నట్టిదే" ఈ దివ్యసందేశమునే నన్నయభట్టారకుడు ప్రతిపాదించినాడు. తరువాత తెలుగుకవుల లో శృంగార రససాక్షాత్కారము నొందినవారు కొందరే ఉన్నారు. సహృదయులగు శ్రీ రామానుజరావుగారు తెలుగు కావ్యములను మథించి ఆంతరికరసస్వరూపము నెరిగి ఆనందాను భూతితో శృంగారమును పోషించినపోతన, సూరన, క్షేత్రయ్య ముద్దుపళని తమకావ్యములలో అచ్చమైన శృంగారపు లోతుల నెట్లు స్పృశించిరో నిరూపించినారు. వెగటు కలిగించు బాహిర శృంగారము కంటె ఆంతరిక శృంగారము గొప్పదని విశదము చేసినారు. ఈదృష్టితో తెలుగు కావ్యములను సమీక్షించిన వారు లేరు.

ఆధునిక సాహిత్యమునకు సంబంధించిన వ్యాసములు విషయ వైవిధ్యమును వైశిష్ట్యమును కలిగియున్నవి. వీరికి వ్యక్తిచిత్రణమున చక్కని నైపుణ్యము కలదు. ఆయారంగ ములలో సుప్రసిద్ధులగు వ్యక్తుల స్వరూప స్వభావములను కను లకు గట్టినట్లు చిత్రించుట సాధారణ విషయము కాదు. వాస్త విక విషయములకు దూరముగాక తూచినట్లు గుణదోషములను వివేచించి ఎంతటి వ్యక్తికి సంబంధించినదైనను వెనుక ముందాడక యాథార్థ్యమును నిశ్చయముగ ఎత్తిచూపగల దిట్టతనము వీరికి వెన్నతో వచ్చినది. సందర్భోచితముగ వీరుపయోగించు వ్యంగ్యము హృదయంగమమైనది. లోక

మెరుగని వారికంటె లబ్ధప్రతిష్ఠులను గూర్చి వ్రాయుట కష్టము, సజీవులగు వారిని చిత్రించుట కష్టతరము. అట్టిచిత్రణమున వ్యాసకర్తకు గల ప్రతిభ ప్రశంసార్హమైనది.

శ్రీ రామానుజరావు గారి శైలి ప్రత్యేకమైనది. వీరి రచనల ప్రాశస్త్యమునకు విషయ వివేచనా శక్తితోపాటు మనోజ్ఞశైలి ప్రధాన కారణము. శబ్దార్థములకుగల సత్యాసన్నిహిత సంబంధమును చక్కగా నెరిగిన వాడుగుట వలన అర్థవంతములగు అలతి యలతి పదములతో సుందరవాక్య నిర్మాణము నందును, తాము చెప్పదలచుకొన్న భావమును సూటిగ సుస్పష్టముగ మనస్సునకు తాకునట్లు వ్యక్తీకరించుటలోను సిద్ధహస్తులగువీరు ఇట్లే ఆంధ్ర కావ్యసాగరమును మధించి లోకమునకు రసామృతమును పంచి పెట్టెదరని ఆశించుచున్నాను.

దుర్ముఖి శరత్తు
1-10-56

గడియారం రామకృష్ణశర్మ

# శృంగార కవి పోతన

శ్రీనాథ పోతనలు బావ మరదులనియు, సమకాలికులనియు ప్రతీతి. ఆ వరుసతో మనకేమి; అందలి సత్యము చారిత్రకు లెరుంగుదురు; ఈ ఉభయులలో శ్రీనాథుని కవిత్వము శృంగార రసపూర్ణమైనదనియు, బమ్మెర పోతన కవిత్వము భక్తిరస పూరితమైనదనియు సాధారణముగా లోకులవాడుక. కాని నిజమారసినచో యీ వాడుక మాత్రము సంపూర్ణమైన సత్యము కాదని స్పష్టమగుచున్నది. శ్రీనాథుని భీమేశ్వర పురాణము, కాశీఖండము భక్తి సంపన్నములు. పోతనా మాత్యుని భాగవతములో భక్తితోపాటు శృంగార రసము వెల్లివిరియుచున్నది. అక్కచెల్లెండ్ల వంటి యీ రెండు రసములు సమానముగా ఆదరించి పోషించిన ఆంధ్ర కవులలో బమ్మెర పోతన ప్రముఖుడని భాగవతము నందలి ప్రతి స్కంధము ఋజువు చేయుచున్నది. వాస్తవము విచారించి నచో సుకుమారమైన శృంగార చిత్రణము నందు పోతనతో సమానుడైన తెలుగు కవి మరొక్కరు లేరని తోచుచున్నది.

ఏ కొంచెము అవకాశము కలిగినప్పటికిని, శృంగార రస పోషణమునకు పోతన కలము ముందుకు దుముకు చుండును. గాఢమైన భక్తిచే ఆవేశము పొందిన సందర్భాలలో కూడ పోతన హృదయము శృంగార భావములతో ఉప్పొంగి

పోయిన ఉదాహరణల నెన్నియైన చూపించ వచ్చును. ఒక్క మాటలో చెప్పవలె నన్నచో పోతన శృంగారము యొక్క మాధుర్యము, వైవిధ్యము ఆంధ్ర భాషలోని మరొక గ్రంథము నందు కనుపించదు. శ్రీనాథుడు మహాకవియే; తెలుగు దేశమును, తెలుగు నదులను, తెలుగు ఆచారములను కవితా దర్పణమున మనోహరముగా ప్రతిబింబింప జేసిన కవిసార్వ భౌముడే, ఆయన ఆంధ్రుల యింటి షడ్రసోపేత భోజనమును నోరూర, నోరార వర్ణించిన కవులలో అగ్రగణ్యుడు. కాని శృంగార రస చిత్రణము నందు మాత్రము పోతనతో శ్రీనాథుడు సమానుడు కాడని నిస్సంశయముగా చెప్ప వచ్చును. అంత మాత్రన శ్రీనాథ కవీంద్రుని వాసి తగ్గ వలసిన ఆవశ్యకత ఆవంతయు లేదు. శ్రీనాథుని శృంగార రచనలు పరిశీలించిన అది సమకాలిక సుందరీమణుల యొక్క రూపు రేఖలను, కప్పు కొప్పులను, చక చకలను, తళ తళలను, పై మెరుగులను వర్ణించుట వరకే పరిమితమైనట్లు కనుపించు చున్నది. రూప వర్ణనతోడనే శ్రీనాథునిలో భావచ్యుతి జరుగు చుండును. విలాస విభ్రమాలను, శృంగార క్రీడా విశేషాలను, అపూర్వ మధుర సన్నివేశాలను, హృదయము నుండి ఉత్కటముగా దూసికొని వచ్చు ప్రేమ భావాలను చిత్రించుటలో పోతన్నతో శ్రీనాథునకు పోలికయే లేదు. శ్రీనాథుని నైపుణ్య మంతయు ఆకారవర్ణనతోనే ఆగి పోవు చుండును. ఇందుకు యీ ఉభయుల రచనల నుండి యెన్నియైన నిదర్శనాలను ఏరి చూపించ వచ్చును.

పోతన చిత్రించిన శృంగారము విలక్షణమైనది; మధుర భావోపేతమైనది. అపూర్వమైన శృంగార ఘట్టములను, విలాస భావాలను పరిదర్శించుట యందు పోతన కలమునకు గల నేర్పు అద్వితీయమైనది. శృంగార చిత్రణమునకు పోతన కలిగించుకొను అవకాశములు కూడ ఇతర కవీశ్వరులకు తెలియని పరమ రహస్యములు. ఈ దృష్టితో భాగవతము లోని ఇష్టదేవతాది ప్రార్థనమునే పరిశీలించి నప్పుడు మొట్ట మొదటి పద్యమే మనము చూపించగల చక్కని మచ్చుతునక. పోతనామాత్యుని సరస్వతీదేవి చంచరీకచయ సుందరవేణి; సైకతశ్రోణి; తోయజాత భవచిత్త వశీకరణైక వాణి; వామనమూర్తికి మూడడుగుల నేల ధారపోయు నప్పుడు, ఆదానమును గ్రహించు భగవంతుని హస్తమును "ఆదిన్ శ్రీసతి కొప్పుపై తనువుపై అంసోత్తరీయంబుపై, పాదాబ్జంబులపై కపోలతటిపై, పాలిండ్లపై నూత్నమర్యాదం జెంది వెలుంగు" కరమని బలిచక్రవర్తి భావించుటలో బమ్మెర పోతన శృంగార హృదయము తొంగి చూచు చున్నది. లావొక్కింతయు లేక, ధైర్యము విలోలమైన గజేంద్రుని రక్షణకు పరుగులెత్తుచున్న పరమేశ్వరుడు వైకుంఠ పురము నందలి సౌధములోని రమా వినోదియట; వివాద ప్రోద్ధత శ్రీకుచో పరిచేలాంచలముతోనే ఆయన వెంట వెళ్లు శ్రీదేవి యొక్క సౌందర్యమును గమనించుడు! ఆమె తాటంకములు చలించుచున్నవట; ధమ్మిల్ల బంధము భుజము మీద నటించు చున్నదట. అదృఢముగా నున్న చంచత్కాంచితో, శాటీముక్త కుచముతో ఆతరుణమున ఆయమ్మ

కోటీందు ప్రభతో వెలిగినదట. ఇటువంటి మనోహర దృశ్యములను చిత్రించినవారు ఆంధ్ర కవులలో యెంతమంది కలరు? శ్రీనాథ రచనలలో ఇటువంటి సన్నివేశము లెక్కడ?

ఆంధ్రుల అభిమాన నాయికయైన సత్యభామను సహజ పాండిత్యుడు చిత్రించిన నేర్పు అద్వితీయమైనది. తెలుగు సారస్వతములో ఇంతచక్కని చిత్తరువు ఇంకొకటి కనుపించదు. సత్యభామ బహు సుకుమారి; బొమ్మ పెండ్లిండ్లకు పోనొల్లనుబాల; మగవారి గనిన మరుగుజేరెడు ఇంతి, పసిడి యుయ్యాలలెక్క భయమందు భీరువు; సఖుల కోలాహలస్వనము లోర్వని కన్య, వీణ చక్కగబట్టు వెరలెరుంగని కొమ్మ; మ్రాకున తీగె గూర్పగనేరని లేమ; సరవి ముత్యము గ్రువ్వజాలని అబల; చిలుకకు పద్యము చెప్పనేరని తన్వి. అయినప్పటికిని హృదయేశ్వరుని సమక్షమున వీరనారీమణియై, రాక్షసేశ్వరుని మీద విజృంభించినది. అప్పటి ఆమె సొగసును పోతనయే వర్ణించవలెను. మరొక కవీశ్వరునకది శక్తికి మించినపని; ఆమె సౌవర్ణ కంకణ ఝణఝణ నినదములు శింజినీరవముతో చెలిమి సేయుచున్నవి. తాటంకమణిగణ ధగధగ దీప్తులు గండమండల రుచిని కప్పివేసినవి. ధవళ తరాపాంగ ధళధళ దోచులు బాణజాల ప్రభాపడలి నడపుచున్నవి. శరపాత ఘుమఘుమ శబ్దము పరిపంథి సైనిక కలకల స్వనము నడపుచున్నది. వీరము, శృంగారము, భయము, రౌద్రము, విస్మయము కలిసి ఆకారము దాల్చిన భామినివలె ఆమె మనకు ప్రత్యక్ష మగుచున్నది. ఒకవైపున వీరము,

ఇంకొకవైపున శృంగారము ఆమెయందు మూర్తీభవించినవి. ఆమె పరుని జూచినప్పుడు ఒక పద్ధతి; వరుని జూచినప్పుడు మరొక పద్ధతి; ఏకాలమున "నొంప మరియు నలరింప" ఆమె సమర్థురాలు. ప్రాణేశ్వరుని జూచినప్పుడు సొంపు, నరకాసురుని జూచినప్పుడు కెంపు, ఏకక్షణము ఆమె కన్నులలో కనుపించుచున్నవి. ఆమె మోము హరికి రాకేందు బింబము; అరికి రవిబింబము, ఆమె చేలాంచలము హరికి కందర్ప కేతువు అరికి ఘనధూమ కేతువు; ఆమె సందర్శనము హరికి అమృత ప్రవాహము; అరికి అనల సందోహము.

కేవల రూపకల్పన యందే కాదు; భావచిత్రణమందును పోతన అద్వితీయుడు; ఆయన చిత్రించినన్ని శృంగార భంగిమలు, క్రీడలు, విలాసభావములు ఇంకొకరు చిత్రించలేదని చెప్పినచో సత్యమునకు తలవంపులు కలుగజాలవు. కుబ్జాకృష్ణుల క్రీడా విశేషము, ఉషానిరుద్ధుల పరిణయము, రుక్మిణీకృష్ణుల కేళీవిలాసము మొదలైన ఘట్టములు పోతన్న చిత్రించిన శృంగారము యొక్క వైవిధ్యమునకు చక్కని తార్కాణములు. రుక్మిణీదేవితో శ్రీకృష్ణుని విరసోక్తులు, ఆ విరసోక్తులతో నొప్పిజెందిన ఆమె హృదయము, ఆహృదయము లోని భావాలు ప్రత్యక్షమగుచున్న ఆకారము, పోతన చిత్రించిన అపురూప శృంగారఘట్టములలో నొకటి. ఇటువంటి సన్నివేశములు ఇంత రమణీయముగా చిత్రించిన తెలుగు కవీశ్వరుడు ఇంకొకరు కనుపించరు. సూరన అయిదుతీరులు

శృంగారమును చిత్రించినాడట, కాని పోతన అరువది రీతుల శృంగారమును చిత్రించినాడు.

శ్రీకృష్ణుని గోకుల విహారము, గోపికా వస్త్రాపహరణము, రాసక్రీడలు, ఆ సందర్భాలలో మధురమూర్తులైన ఆ గోపికల చిత్తవృత్తులు, సరస సల్లాపములు, అలుకలు అన్యాపదేశములు, అనునయములు, ప్రణయకోపములు ఆంధ్ర శృంగార వాఙ్మయమున అద్వితీయ ఘట్టములు. ఈ భాగములోని ఒక్కొక్కపద్యము ఒక్కొక్క రత్నము. ఇవి సామాన్యమైన రత్నములు కావు. అన్నియును జాతి రత్నములు; సానలదీరిన రత్నములు, నల్లనివాడు, పద్మనయనంబులవాడు, కృపారసంబు పైజల్లెడువాడు, మాళి పరిసర్పిత పింఛమువాడైన శ్రీకృష్ణుని గోపికలు ఒకానొక శరదాత్రినిచేయు అన్వేషణ, ఆ సందర్భమున విరహతప్తలైన గోపికల హృదయాలనుండి ఉబికి కొనివచ్చిన ప్రేమభావాలు బహురమ్యముగా చిత్రించినాడు బమ్మెర పోతన. గోపీకృష్ణుల క్రీడా విశేషాలను కనులకు గట్టినట్లు అతిసుకుమారముగా మనయెదుట ఆయన ప్రదర్శించినాడు. గోపాలకృష్ణుని జాడలు తెలుసుకొనుటకో గోపికలు చూపించు గుర్తులు ఎంత మనోహరమైనవి! ఒకచోట ఆయన మోపిన పాదాగ్రము కనపడుచున్నది. అందువలన అక్కడ కొమ్మకు పువ్వులు గోసినట్లు భావించుచున్నారు. వెంటనే అడుగులజాడ మాయమైనది. బహుశా సతినెత్తికొని వెళ్ళిన చిహ్నమేమో అది; ఇంకొకచోట కూర్చున్న గుర్తులు కనపడుచున్నవి, ప్రేయసికి ధమ్మిల్లము

పెట్టినాడేమో అక్కడ; మరొకచోట యెవరో యొక వెలదీ నిక్కిన చొప్పు గోచరించుచున్నది. అధూర్త గోపాలుడు ఆమెకు కైమోడ్పని యిచ్చిన చోటిది యని స్పష్టముగా అనుమానము కలుగుచున్నది. కొంతదూరము వెళ్ళిన తరువాత వేరొకచోట నాలుగు చరణాలు ప్రక్కప్రక్కన కనుపించినవి. అందుచేత అది గోపాలకృష్ణుడు యెవరో యొక యెలనాగ చేయూదినస్థలమని స్ఫురించుచున్నది. మరొకచోట మగజాడ లోపల మగువజాడ కనుపించినది, తప్పక యీచోట ఆ శృంగార పురుషుడు యెవరో యొక నీలవేణిచే యొదిగి యుండవచ్చును. ఇంకొకచోట రమణి మోకరిక్కిన చొప్పు కనపడినది. వేరొకచోట అన్యోన్య ముఖములైన అంఘ్రులు ప్రణయ కలాపమును ప్రదర్శించినవి. ఈ విధముగా యీ ఘట్టము అత్యంత రమణీయముగా, బహు సుకుమారముగా అతి మనోహరముగా వర్ణితమైనది. శ్రీనాథాదుల రచనలో ఇటువంటి సొగసులు కానరావు. అట్లని చెప్పుటకు దారు కావన విహారాదులు నిదర్శనములు.

తెలుగు భాషలోని శృంగార గ్రంథములను అవలోకించి నప్పుడు, శృంగార కవుల రచనలను పరిశీలించి నప్పుడు పోతన చిత్రించిన శృంగారము ముందు నిలువ దగిన రచనలు యెన్ని కలవు ? అను ప్రశ్న సహజముగా కలుగు చున్నది. శృంగార కవిత్వమునకు ప్రసిద్ధి గాంచిన వారి రచనలు భాగవత శృంగారము ముందు, దివాకరుని యెదుట నున్న దివిటీ వలె గోచరించును. వాస్తవముగా తెలుగు కవులలో శృంగార

రసచిత్రణము నందు పోతన సర్వవిధాల అగ్రగణ్యుడు పోతనను శృంగార కవి యనుటలో తప్పేమి కలదు? శృంగార మనినచో మడిగట్టు కొనవలసిన అవసరమేమి? భక్తి రస మును యెంత బాగుగా పోషించినాడో, శృంగార రసమును అంత సమర్థతతోనే, పోతన చిత్రించినాడని చెప్పుటకు నిదర్శ నాలు భాగవతమున ఎన్నియైనను చూపించ వచ్చును. ఆంధ్ర శృంగార కవులలో పోతనది అగ్ర తాంబూలము; తెలుగు భక్తి కవులలో పోతన మున్నెన్న దగినవాడు.

పోతనను కవిత్వము వలచి వరించినది, దానితో పాటు పాండిత్యము గూడ ఆయనకు సహజముగా అలవడినది. ఆంధ్ర కవులలో సహజ పాండిత్యుడను ప్రత్యేకత పోతన కొక్కనికే కలదు. భాష ఆయన చేతిలోని క్రీడాకందుకము.

# క్షేత్రయ్య శృంగారము

తెలుగు కవులలో శృంగార రసపోషణమున క్షేత్రయ్యకు ప్రత్యేకత, విశిష్టత కలవు. ఆయన రచించిన పదాలన్ని యును శృంగార రస ప్రధానములే. శృంగారము తప్ప ఇంకొక రసమువంక క్షేత్రియ్య దృష్టి ప్రసరించినటుల కన బడదు. ఈపదాలకు నాయకుడు దక్షిణ నాయకుడైన శ్రీకృష్ణుడు; నాయిక చాలమట్టుకు స్వీయగా యీపదాలలో కన్పడుచున్నది. పరకీయ సామాన్య నాయికలుకూడ కొందరు వీరిలో కనిపించు చున్నారు. ఈ నాయికల హృదయస్పందనాలను, నాయకుని హృదయస్పందనాలను క్షేత్రయ్య తన పదాలలో వర్ణించి యున్నాడు.

ఈ పదాలలో విశేషముగా విప్రలంభ శృంగారమే ప్రక టిత మగుచున్నది. ప్రాణేశ్వరుడు తన దగ్గర లేనందున, తన దగ్గరకు రానందున, నాయికల హృదయాలలో కలుగుభావాలు యీ పదాలలో అక్షరరూపము పొందియున్నవి. ప్రియ వియోగముచే పరితప్తమైన హృదయపు ఉద్వేగము, ఆవేదన యీ పదాలకు ఇతివృత్తము. వీనిలో యెక్కువగా నాయికా విరహము అనగా స్త్రీ విరహమే ప్రకటితమగు చున్నను, కొన్నింటిలో నాయకుని విరహము అనగా పురుష విరహము కూడ ప్రదర్శితమగుచున్నది. మన ఆలంకారికులు తమ

లక్షణ గ్రంథాలలో నిర్దేశించిన నాయికలందరును యీ పదా లలో గోచరించుచున్నారు. వీరిలో ముగ్ధలు, మధ్యలు, ధీరలు, అధీరలు, ధీరాధీరలు, జ్యేష్ఠలు, కనిష్ఠలు, స్వాధీన పతికలు మొదలైన అన్ని తరగతుల నాయికలు కలరు. తుదకు బాలెంతరాలైన నాయికయొక్క శృంగారమును కూడ చిత్రించక క్షేత్రయ్య వదలి పెట్టలేదు. ఈ పదాలను యే మాత్రము స్థూలముగా పరిశీలించినప్పటికిని వివిధ, శృంగార నాయికలయొక్క చిత్తవృత్తులను ప్రదర్శించుటలో క్షేత్రయ్య అద్వితీయమైన నేర్పు చూపించినట్లు స్పష్టము కాగలదు.

క్షేత్రయ్య పదాలలో ప్రతిపంక్తియందును, ప్రతి పద మునందును శృంగారమే ప్రత్యక్షమగుచున్నది. శృంగార రసమును ఇన్నితీరుల, ఇంత వైవిధ్యముగా, శృంగార నాయిక లను ఇన్ని రకాలుగా, ఇంత నిపుణముగా చిత్రించిన ఆంధ్ర కవీశ్వరుడు మరొక్కడు లేడని చెప్పిన అతిశయోక్తి కాజాలదు.

ఈ పదాలలో నాయకుడైన మువ్వగోపాలుడు మిక్కిలి అందగాడు. అన్నింటియందును నెరజాణ. కొక్కోకశాస్త్రము నందు పారంగతుడైన పండితుడు. ఈడులేని రతులనేలి ప్రియురాలిని మేను మరపించగల రసిక చక్రవర్తి. ఇటువంటి శృంగార నాయకునితో సహవాస భాగ్యమబ్బిన విలాసినులు మాత్రము సామాన్యలా! వారందరును అందాల రాణులు; చాశీతి బంధములలో ప్రవీణలైన నెఱజాణలు. ఆనాడు ననవిల్తు శాస్త్రంబు మినుకులావర్తించుపని వెన్నతోడ బెట్టి నది మాకు అని గర్వముగా చెప్పుకొన్న వరూధినికి యీ

నాయికలందరును దగ్గరి చుట్టాలని చెప్పవచ్చును. తన యుర మున నే తప్ప శయ్యమీద పవ్వళింపదనియు, తనతో తప్ప ప్రాణపదమైన చెలులతోగూడ ముచ్చటలాడదనియు, ఆరూఢ రతికేళిలో తానే కాని నన్నులయనీయదనియు, నేను అలిగితే తానేవచ్చి వేడుకొనునుగాని తన సఖీమణులను రాయబారము పంపదనియు, ఒక సన్నివేశములో ఒక నాయి కనుగూర్చి నాయకుడు ఒక పదములో తలపోసి తమ పరస్పర అనుబంధమును, అనురాగమును, నాయిక యొక్క నేర్పును విశదీకరించి యున్నాడు. ఇంకొకచోట ఒక నాయిక ప్రియుడు తన దగ్గరకువచ్చి, చెంతనిలిచి, కొప్పులో పూవులు సవరించి నది మాత్రమే తనకు జ్ఞప్తియున్నది కాని చురుకు కెంపు మోవిపైనుంచుట తెలియనైతినని తన పారవశ్య విభ్రమమును ప్రకటించుకొన్నది. ఇవి మచ్చుతునకలు మాత్రమే. ఈ విధముగా యీ గేయాలలో ఒక్కొక్కటి ఒక్కొక్క విధమైన శృంగార చిత్తవృత్తిని వ్యక్తీకరించుచున్నవి.

క్షేత్రయ్య తన పదాలలో చిత్రించిన నాయికలకు ప్రాణేశ్వరుని చిత్తవృత్తిని గ్రహించుటలో ప్రత్యేక ప్రావీణ్యము కలదు. ఒక నాయిక తన ప్రాణేశ్వరుని ఒకమారు బ్రతిమిలాడి పాదాక్రాంత యగును. ఇంకొకమారు కన్నీటి కాలువలో ఆయనను ముంచి తేల్చును. మరొక్కసారి ఘనమైన జడవేత్రుటుతో ఆయనను శిక్షించును. అనగా సామదానభేద దండోపాయములను ఉపయోగించి ప్రియుని తమకు స్వాధీనునిగా జేసికొనుటలో ఆరితేరిన వారుగా

యీ నాయికలు కన్పట్టుచున్నారు. ఈ నాయికలు పరిపాలించు శృంగార రాజ్యమునకు సర్వవిధములైన సాచివ్యము నెరపగల సమర్థులైన సఖీమణులు ఈ పదాలలో మనకు కన్పడుచున్నారు. చూడుడు; ఒక నాయికకు తన ప్రియుడు అగపడగానే ఆయన శరీరముమీది రతిచిహ్నములమీద ఆమె దృష్టి ప్రసరించును. కాని ఆమె ఆగ్రహించక సమయానుకూలముగా వ్యవహరించి ఘాటుగా మాట్లాడక అసూయను మాత్రమే ప్రకటించును. ఎత్తిపొడుపు మాటలతో ఆయనను కొంత వేధించునుగాని ఇంటినుండి వెడలిపొమ్మని చెప్పదు. ఇంకొక నాయిక ఇదే సన్నివేశములో యీ మాత్రము అసూయనుకూడ ప్రకటించక గంభీరముగా యేమియు తెలియనట్లు వ్యవహరించును. ఇక సామాన్య నాయికల శృంగార వృత్తాంతము, క్షేత్రయ్య నాయికలలో పరకీయలు, సామాన్యలుకూడ నున్నారుకదా! ఈ పరకీయ నాయికలలో ఒకతె "నా మగడు కత్తికోతకాడు. నాకు నీవు ఆజ్ఞయీయక తప్పదు. నేను అత్తవారింటికి పోకతప్పదు. అయితే అక్కడమాత్రము నేను ఎల్లప్పుడు ఉండగలనా;అక్కడ నామగని బంధువులతో జగడమాడి తిరిగి రాగలను. లేక నీవైన ఒకసారి యేతిరునాళ్ళ నెపముతోనో మా ఊరికి రారాదా!" అని సెలవుతీసికొని వెళ్ళును. సామాన్య నాయికలు ధనాసక్తితో డబ్బు యిమ్మని అడుగుట యీ పదాలలో కనపడును. "అయిదు వరహాలు యీయగలిగితె నేరా!" అని ఖండితముగా చెప్పినప్పుడు.

కొక్కోకమెల్ల జదివిన
చక్కనివాడైన రాజ చంద్రుండైనన్
రొక్కముసీయక యెప్పుడు
చిక్కదురా వారకాంత, సిద్ధము సుమతీ.

అన్న సుమతి శతకములోని పద్యము వేంటనే జ్ఞప్తికి వచ్చును. ఈ నాయికలు మరియు వారి చెలికత్తెలు సరస సంభాషణములందు, చమత్కార ప్రసంగములందు ఆరితేరిన ప్రోఢలు.

క్షేత్రయ్య నాయికలు ఆపాదమస్తకము శృంగార మూర్తులు. వారి గృహాలు శృంగార నిలయములు. అందులో వారి పడకటిండ్లు అందాల సీమలు. ఇండ్లను, పడకటిండ్లను అలంకరించుటలో విలాసవతులైన క్షేత్రయ్య నాయికలకు అసమానమైన చతురత్వము కలదు. సహజముగా సుంద రాంగులైన యీ నాయికలు కట్టుబొట్టు తీరులందు ప్రదర్శించు శోభ మిక్కిలి రమణీయము. వస్త్రధారణమందు అలంకార ములందును ఈ నాయికలు ప్రత్యేక శ్రద్ధను ప్రదర్శించి మోహన మూర్తులుగా మనకు సాక్షాత్కరించుచున్నారు. వారి వేషాలంకరణములను జూచినచో ప్రియుని ఆకర్షించు విద్యను ఒక ప్రత్యేక కళగా అభ్యసించిన సుందరాంగులు వీరని స్పష్టము కాగలదు. ఆనాడు తంజావూరులోని విలాసవతుల శృంగారమును ఈనాడు కవితా రూపమున క్షేత్రయ్య మనకు చూపించుచున్నాడు. రకరకాలైన చీరలతో అందుకు

తగిన రవికలతో యీ పదాలలోని నాయికలు మన యెదుట ప్రత్యక్షమగు చున్నారు.

వస్త్రాలంకరణము సందేకాక శిరోజములను దిద్ది తీర్చు కొనుటలో యీ నాయికలకుగల ప్రావీణ్యము మిక్కిలి గొప్పది. గుత్తపు వన్నెల కీల్జడ యీ నాయికలకు అత్యంత ప్రేమాస్పదమైనదని యీపదాల వలన మనకు తెలియుచున్నది. ఆ రోజులలో పూవులులేని జడలు లేనే లేవు. జాజులు, విరజాజులు, మల్లెలు, మొల్లలు మొదలైనవి యీ నాయికల కొప్పులలో నుండి సువాసనలను విరజిమ్ముచున్నవి. ఇందుకు తోడు ఘనసారము, కస్తూరితో మిళితమైన తాంబూలము ఎల్లప్పుడును ఆనాయికల పుక్కిళ్ళలో పరిమళించు చుండుట మనకు అడుగడుగున కనుపించు చున్నది. ఈ నాయికల జడ లలో వదులైనవి మిక్కిలి తక్కువ. ఎందుకనగా కోపము వచ్చినప్పుడు నాయకునిమీద జడవేట్లులను వేయననువుగా నల్లుకొనుచుండుట ఆనాటి వాడుక; అందుకొరకే క్షేత్రయ్యనివ సించిన తంజాపుర రాజుల కాలమున ఒకచోట పద్యములో నాయిక తన సఖితో,

" సరసురాలవు జబ్బుగ నల్లినావదేమే జడ " అని ప్రశ్నించినప్పుడు", ఆ విజయరాఘవుని మేను, చిగురాకు వంటిదని, చెలికత్తె వెంటనే సమాధానము చెప్పిన సంగతి సుప్రసిద్ధమైనది. ఉంగరాలు, గాజులు, కమ్మలు,

మొలనూలు, మకర, నాగసరాలు, చెంపసరాలు చిన్నసరాలు మొదలైన ఆభరణాలమీద యీ కాంతలకు అమితమైన ప్రేమ. కాళ్ళకు లత్తుక, కన్నులకు కాటుక యీ కాంతల అలంకారాలలో అనివార్యమైనవి.

ఈ నాయికల పడక గదులు మిక్కిలి ఆకర్షణీయము లైనవి. పట్టెమంచము, దానిపైన పరుపు, పరుపుమీద తెల్లని దుప్పటి, దుప్పటిమీద కమ్మతావులువిరజిమ్మపూవులు, కొంతదూరములో నిలువుటద్దము, గదిముందు, ముద్దు పలుకులు పలుకు చిలుకలతో గోరువంకలు, ఒకచోట తూగుటూయెల గల ఆసన్నివేశము ఎంతశృంగారమైనదో ఆలోచింపుడు. పన్నీరు గంధము, బుక్కా మొదలైన సుగంధ ద్రవ్యములు ఆ నాయి కలు సదాఅనుభవించు విలాస సామగ్రి. ఉయ్యాలలూగుట చదరంగమాడుట మొదలైన విలాస క్రీడలలో ఈ నాయికలు అత్యంత ప్రౌఢలు.

ఈవిధముగా క్షేత్రయ్య తన ప్రతి పదమునందును శృంగారమును గుప్పించినాడు. సంగీతము, సాహిత్యము, అభినయము ముప్పిరిగొనియున్న క్షేత్రయ్య పదాలలో, తంజాపుర రాజుల శృంగార జీవితము ప్రతిబింబితమగు చున్న దని చెప్పవచ్చును. ఆ కాలమునాటి విలాస జీవనమును క్షేత్రయ్య చాల చక్కగా చిత్రించినాడు.

ఈపదాలకు నాయకుడైన గోపాలుడు మదనమోహను డైన రసజ్ఞమూర్తి. నాయికలు బంగారపు బొమ్మలైన

శృంగారమూర్తులు. వారు నివసించు మందిరములు సౌందర్య దేవతకు నిలయములు. రసికులకు అనుభవ యోగ్యమైన విలాస సామగ్రి యంతయు ఆ సుందరాంగుల మందిరములందు సమృద్ధము. వేషభాషల యందు, అలంకారము లందే కాక రుచులు, అభిరుచులందు కూడ యీ నాయికల శృంగార ప్రీతి ప్రకటితమగు చున్నది.

# సూరన కళాపూర్ణోదయము

"విరిసిన నొక్కయొప్పు, అరవీడిన వేరొకయొప్పు, జిక్కువా టారసిన నొక్కయొప్పు, నదియూడ్చిన వేరొకయొప్పు, వేణిభా వరచన నొక్కయొప్పు, ముడివైచిన వేరొకయొప్పు, కొప్పుగా బరగిన నొక్కయొప్పు, కనుపట్టకమానదు నీకచంబులన్"

అని యొకానొక నీలవేణి కుటిల కుంతల శోభను పింగళి సూరన ప్రశంసించినాడు. ఆ సొగసులాడిని మనము చూడలేదు, కాని, ఆశోభయేమో, సూరన శృంగారమునందు, ప్రస్ఫుటముగా గోచరించుచున్నది. జగదేక సుందరియైన చిగురుబోడి శిరోజ సౌభాగ్యమువలెనే సూరన కవిత్వము శోభిల్లుచున్నది. అది యేరీతిగ అల్లినప్పటికిని, అందులో యేదో యొక ప్రత్యేకమైన రామణీయకత గోచరించు చుండును.

ఆంధ్ర శృంగారకవులలో సూరనది అద్వితీయస్థానము. తెలుగు భాషలో శృంగార కవులని ప్రత్యేకముగా ప్రఖ్యాతి గాంచినవారు కలరు. ఆద్యంతము శృంగార మొలుకునట్లుగా రచన గావించవలెనను అభినివేశముతో కలముల నాడించిన కవీశ్వరులు కలరు. వీరందరిమధ్య, చుక్కలలో సూర్యునివలె, సూరనార్యుడు శోభిల్లుచున్నాడు. కళాపూర్ణోదయ

మను గ్రంథ నామకరణమే, ఆయన ప్రతిభను మరియు అభి
రుచి ప్రాశస్త్యమును వెల్లడి చేయుచున్నది.

స్వర్గ మర్త్యలోకములను ఒక్కముడితో బిగించువాడని కాళిదాస కవీంద్రునిగూర్చి ఒక సుప్రసిద్ధ విమర్శకుడు చెప్పిన మాటలను కళాపూర్ణోదయము జ్ఞప్తికి దెచ్చుచున్నది. సూరన్నకూడ శృంగార బంధముతో మర్త్యలోక స్వర్గలోక సత్యలోకములను ఒకచోట ముడివేసినాడు. కళాపూర్ణో దయములోని కథకు యీ మూడులోకాలు ముఖ్య రంగ స్థలాలు. వీనితో వైకుంఠమునకుగూడ సూరనార్యుడు బాంధ వ్యము కలిపినాడు.

సుకుమార శృంగార చిత్రణమునందు సూరనకు కాళి దాసుతో చాల దగ్గరి చుట్టరికము కలదు. కొన్ని విషయా లలో షేక్స్పియర్ కుకూడ యీాయన సమీాప బంధువు. శృంగార రసపోషణమున నిగ్రహము మరియు సభ్యతలను పాటించిన కవులలో సూరన కాళిదాసు తరగతికి చెందిన వాడు. తన కథలోని నాయికా నాయకులను నిర్ణయించు కొనుటలోనే ఆయన ప్రత్యేక ప్రతిభ ప్రదర్శితమగు చున్నది. తాను చిత్రించ దలచిన శృంగార వైవిధ్యమునకు అనుగుణ ముగా ఆయన తన పాత్రలను యెన్నుకొనినాడు. కొంచెము పరిశీలించినచో ఇందలి సత్యము స్పష్టము కాగలదు.

శల్యాసురుడు, రాక్షసులకోవకు చెందినవాడు. చూపు తోడనే వానికి వలపు కలిగినది; ఆ వలపు తత్క్షణమే అను

భవమునకు ప్రేరేపించినది. అట్లు తాను కాంక్షించిన కాంతా మణిని, అనుభవించు ప్రయత్నమున, తన శస్త్రలను జంతు జాలము మీద వ్యర్థము గావించినాడు. కాని ఇష్ట పడ నందున ఆమెను బలాత్కరించలేదు; ఆమెకు అపాయము చేయుటకు యత్నించలేదు; తుట్ట తుదకు తానే మోసపోయి, హతుడైనాడు. శల్యాసురుడు మానవత్వమున కన్న క్రింది దశలో నివసించు ప్రాణి. తరువాత మన దృష్టి మానవలోకము మీద ప్రసరించు చున్నది. ఈ రంగమున మనకు కనుపించు జంటలు మూడు. సుగాత్రీశాలీనులు, కలభాషిణీ మణికంధరులు, మధురలాలసా కళాపూర్ణులు.

శాలీనుడు మర్త్యలోకము నందలి సామాన్య సంసారి. ఆయన రుచులుకూడ సహజమైనవి. సహజమైన సొంపులే గాని కృత్రిమమైన భూషణాలు ఇంపుగాక పోవుట శాలీనుని విశిష్టత. పడకటింటిలో ఆభరణ భూషితాంగి యైన భార్యా మణి కన్న, తోటలో తనతోపాటు కష్టపడి పనిజేయు అర్ధాంగి యే ఆయనకు ప్రేమాస్పదురాలు. శాలీనుని దొక విధమైన జానపద చిత్తవృత్తి. శాలీనునికి తగినట్టిది సుగాత్రి; పాపము; పతిని ప్రాణముగా భావించుకొను సాధ్వి, స్నేహితురాండ్రి మరియు తల్లి ఎంత నూరిపోసి నప్పటికిని, మౌగ్ధ్యమును వదల జాలని ముద్దరాలు. భర్త తనను ఒల్ల నందుకు ఆమె ఆగ్రహించలేదు; మానసముగా ఆయన సేవలో నిమగ్న యైనది; తన మీద మనసు లగ్నమైన తరుణమున స్వాధీనురాలైనది. భర్త చిత్తవృత్తిని అనుసరించి మెలగు స్వభావము ఆమెది.

పరస్పర సంబంధాలలో ఈ దంపతులకు ఎరువు తెచ్చు కొనిన కృత్రిమత్వము యేమియును లేదు. చల్లగా, శాంతముగా, అన్యోన్యముగా సాగిపోవు సంసారము వారిది.

కలభాషిణీ మణికంధరులు సామాన్య సంసారులవంటి వారు కారు. మణికంధరుడు కవీశ్వరుడు. గాన కళోపాసకుడు. అందాతనికి నారదునితో సమానమైన ప్రావీణ్యము. ఆ కలహభోజనుని సేవలో నున్నప్పుడే ఆయన చిత్తము కలభాషిణి మీదికి పోయినది, కాని వారి దాంపత్యము పొసగలేదు; సంసారియగుటకు బదులుగా ఆయన సన్యాసి యైనాడు. తీర్థయాత్రలు, తపస్సు, రంభాసమాగము, మాయా నలకూబర వేషము క్రమక్రమముగా ఆయనకు తటస్థించినవి. కలభాషిణి స్వైరవిహారధీరయైన వేశ్యాంగన. కూకటివేణితో కుచులు గూడక మున్న ఆమె కోసము ద్వారకా నగర విటావళి ఉవ్విళ్ళులూరినది. చక్కదనము, వన్నెలాడితనము, కలికితనము ఆమెయందు పుష్పిరిగొన్నవి. ఎలప్రాయముననే ఆ కోమలాంగి చిత్తము సంగీత సాహిత్యాల కారణాన మణికంధరుని మీదను మరియు ఇతర కారణాన నలకూబరుని మీదను లగ్నమైనది; దానితోపాటు నాకమృగీ నేత్రలమీద కయ్యమునకు కాలుచాచు అసూయకూడ అంకురించినది. నలకూబరుని స్వాధీనుని గావించుకొను ఉద్దేశమును మనసులో నుంచుకొని, మరొక నెపముమీద, తనకు యిష్టమువచ్చిన స్త్రీరూపము ధరించు వరము సురమానికడ సంపాదించినదా యెలనాగ. తరుణము దొరికినంతనే వేషము

మార్చి మాయారంభయైనది. ఆ వేషములో ఆమె జూపిన చాతుర్యము, మాటకుమాట బదులుచెప్పు నేర్పు, ప్రతిభావంత మైనది. రంభవంటి ప్రౌఢ నారీమణిని తన వచోవిలాసము చేత, నటనా కౌశల్యముచేత సతమతము గావించిన జగజంత కలభాషిణి. సవతి వేషము బహుచక్కగా వేసి, రంభకన్న యేడాకులు యెక్కువగా జదివిన నెరజాణగా తనను నిరూపించుకొనినదా యెమ్మెలాడి. మధురలాలసా కళా పూర్ణులు రాజవంశీకులు; ఆసాంప్రదాయాలు, ఆలాంఛనాలు వారియందు పరిపూర్ణముగా ప్రతిబింబిత మగుచున్నవి. నిగ్రహములేక, యోగాభ్యాసము చేసి భ్రష్టుడైనవాని శృంగా రము సిద్ధునిది.

స్వర్గమునందలి శృంగార మిథునము రంభా నలకూబ రులు; వారు నిరంతర రతిక్రీడాపరాయణులు. రంభ సర్వ కాల సర్వావస్థలయందు తన సొత్తుగా నుండుటకు వీలులేదని తెలిసికూడ ఆమెను వలచి, వరించి, విధేయుడైనాడు నలకూబ రుడు. స్వర్గములోరం భకొరకు వచ్చువారనేకులు; యుద్ధ ములో మరణించిన వీరులు; యజ్ఞ యాగాదులు గావించిన సోమయాజులు; వీరందరిని రంజింప జేయ వలసినది రంభ. ఇందుకు తోడు దేవేంద్రుడు మరియు దేవతలు. దేవతల కొరకు, దేవేంద్రుని పనుపున జేయ వలసిన తపోవిఘ్నాది కార్యాక్రమాలు కూడ ఆమెకు మెండు. అయినప్పటికిని అవకాశము దొరికి నంతనే కుబేర నందనుని కడ రెక్కలు గట్టుకొని వ్రాలుచుండును. ఈ రంభ జగదేక సుందరి; తన

కన్న చక్కనివారు లేరను అభిమానము కలది; నరభామల పోడుముల గూర్చి ఆమెకు యేమంత గొప్ప అభిప్రాయము లేదు. స్వయముగా బహు రుచులు తెలిసిన ఆ భామామణి, తన మట్టుకు మాత్రము సవతి యూహా యైనను సహించ లేదు. శరీర మెక్కడ నున్నప్పటికిని ఆమె హృదయము మాత్రము నలకూబరుని యందే లగ్నమై యుండును. నల కూబర సహవాసములోనే ఆమె యందలి శృంగార చేష్టా విశేషాలు, విలాస విభ్రమాలు పలు రీతుల ప్రత్యక్షమగు చున్నవి. ఏయెడ యెవ్వరు యెన్నడు కనని, వినని, యింపులు బహు కోమలముగా తన గళ స్వనాదులందు సాక్షాత్కరింప జేసి, నలకూబరుని స్వాధీనుని గావించు కొన్నదామె. ఇతరుల సాంగత్యము నందుకూడ ఆమె భావించువాడు నలకూబరుడే. ఆమోటు తపసి, కళలంటి చొక్కింప చేసినప్పుడు కూడ "నలకూబర, విడు, విడు, రా"యని, యే ఆమె ఆలపించినది. కామ కళా కౌశలమున ఆరితేరిన ప్రౌఢయామె. కామము యొక్క వేడి, యౌవనము యొక్క పొంగు, రంభా నల కూబరుల సహవాసమున స్పష్టముగా కనుపించు చుండును.

సరస్వతీ చతుర్ముఖులు సత్యలోకాధి నాథులు. ఇది మరొక విశిష్టమైన జంట. శారద సంగీత సాహిత్యములను స్తనద్వయముగా కలిగి, సకల విద్యలకు, కళలకు రాణి యైన రమణీమణి. చతుర్ముఖుడు స్వయముగా సృష్టికర్త. కామము యొక్క పొంగు, యౌవనము యొక్క వేడి, శాంతించి నిగ్గులు దీరిన ప్రణయ ప్రకోపము వీరి లీలా విలాసము. ప్రణయ కోపము, అనునయము, శృంగార చేష్టలు, మధురవాక్య

సంపదాభిరామమైన సరస సల్లాపములు వీరి కేళీవిలాసము. ఇందులోని శ్లేష యందు ప్రకృతి సుకుమారముగా ప్రతిబింబించు చున్నది.

వీరందరికిని శిఖరాయమానముగా విరాజిల్లువాడు వైకుంఠము లోని రమావినోది మరియు గాన లోలుడైన శ్రీమహావిష్ణువు. చతుర్ముఖ జనకుడైన ఈయనను వేంకట నాధునిగా, రంగనాయకునిగా, ఇతర దేవతా స్వరూపునిగా సూరన పలుమారు కీర్తించి యున్నాడు. ఆప్రశంసలన్నింటి యందును ఆకృతిదాల్చిన శృంగారముగా ఆయన కనుపించు చున్నాడు. వైకుంఠలోకమున శ్రీమహాలక్ష్మి సమేతుడై సర్వేశ్వరుడు యేకాంతమున సంగీతము నాలకించుచు ఆనందించు సందర్భమున, రంభనుజూచి అసూయజెందిన కలభాషిణి వలె, తుంబురునిజూచి ఈరపడినాడు నారదుడు. ఆ ఈర్ష్య పోటీకి కారణమైనది. తుంబురునితో సమానుడు అనిపించు కొనవలెనను హృదయ శల్యమును తీసివేసికొనుటకై, ఆ కలహాభోజనుడు శృంగారమూర్తి, దక్షిణ నాయకుడు, పదారువేల నూటెనిమిదిమంది భార్యలతో పరిపూర్ణ రతోత్సవములందు తేలియాడువాడును అగు శ్రీకృష్ణమూర్తి యొక్క శిక్షణను ఆశ్రయించినాడు. తన హృదయశల్యమును తొలగించుకొను కార్యక్రమమున కలభాషిణికిని రంభకును పోటిపెట్టి, వారిద్దరికిని హృదయ శల్యములను సిద్ధము గావించినాడు.

ఈ విధముగా సకలలోకములందలి శృంగార లీలా విలాసములను అతికోమలముగా చిత్రించినది కళాపూర్ణోదయము. రసవంతమైన యీ కావ్యము "శ్రీవాణీ గిరిజాశ్చి రాయదధతో, వక్షోముఖాఙ్గేషు యే, లోకానాంస్థితి మావహన్త్యవిహతాం, స్త్రీపుంసయోగోద్భవాం" అను నన్నయ స్తోత్రమును జ్ఞప్తికి దెచ్చి, స్త్రీపుంసయోగమును ప్రతిపాదించు చున్నది.

సౌందర్యమును వర్ణించుటలో చాలా చక్కనిపోకడలు పోయినాడీకవీశ్వరుడు. నారద మునీంద్రునికి సుస్వాగతము చెప్పుటకొరకు ఉన్నవాడున్నట్లుగా ఎదురుగా వచ్చు శ్రీకృష్ణుని సౌందర్యము అతి మనోహరమైనది. సహజ సౌందర్యమును, సాలంకృత సౌందర్యమునే కాక చెదరిన సౌందర్యమునుకూడ సూరన చాల నాజూకుగా వర్ణించినాడు. ఈ వర్ణనలయొక్క ప్రతిధ్వనులు అభినవాంధ్ర కవుల రచనలయందు కనుపించు చున్నవి. భయకంపితయైన భామిని సొగసును, రతిక్రీడాలసయైన రమణి చక్కదనమును, అద్దములో జూపించినట్లు వర్ణించి నాడు సూరన.

ప్రేయసీ ప్రియుల సరస సంభాషణలను, కోమల చిత్త వృత్తులను పోషించుటలో సూరన ప్రత్యేక నైపుణ్యము ప్రదర్శించినాడు. కళాపూర్ణోదయము నందలి ఘట్టములు ఇందుకు ఉదాహరణములు. రక్తికిని, భక్తికిని సమానముగా ఉద్దీపకమైన కళ, సంగీతమను సత్యము యీ గ్రంథమున చక్కగా వ్యక్తీకరణ జరిగినది. కళాపూర్ణోదయ మను నామము సర్వవిధాల యీ గ్రంథమునకు సార్థకమైనది.

# ముద్దుపళని - రాధిక

తెనుగు తోటలో పాదులుదీసి తీగెలు బారించిన భామా మణులలో ముద్దుపళని ముఖ్యురాలు. ఆంధ్ర భారతిని మొల్ల, వెంకమ్మ వంటి కవయిత్రులు మేలి సొమ్ముల నలంక రించిరి. కాని వారు త్రొక్కినత్రోవ వేరు; పళని నడిచిన బాట వేరు. ఆంధ్ర కవయిత్రులలోనే కాక, పెద్దన, తిమ్మన, సూరనలను ముగ్గురిని విడిచిపెట్టినచో, ఆంధ్ర ప్రబంధకర్త లందరిలోను ముద్దుపళని అద్వితీయ. ప్రౌఢయైన రాధికను, ముగ్ధయైన ఇళను చిత్రించుటలో ఆమె జూపిన నేర్పు అస మానమైనది. తెలుగు భాషలోని శృంగార సాహిత్యమున రాధికాసాంత్వనము విశిష్టస్థానముకలది.

పళని ప్రతాపసింహుని ప్రేమకు పాత్రురాలై సంగీత సాహిత్యములందు ప్రావీణ్యము గడించిన కళావంతురాలు. ప్రేమాభిరామమైన ఆమె హృదయమునుండి వెలువడిన శృంగార ప్రబంధము రాధికా సాంత్వనము. మన్మథమన్మథుడు శృంగార రసమూర్తియైన శ్రీకృష్ణునికి అంకితమగు యీ కావ్యమునకు కథానాయకుడుగూడ శ్రీకృష్ణుడే. ఆ దక్షిణ నాయకుని వలచి వరించిన రాధా యిళలు యీ కావ్యమునకు నాయికలు. రాధ నెఱజాణయైనచో, ఇల చిఱుజాణ. ఈ జాణ లిరువురి హృదయాలు యీ కావ్యమందు ప్రతిబిం

బించుచున్నవి. ఈ నాయికల చిత్రణలో ముద్దుపళని కళా ప్రావీణ్యము, స్త్రీ హృదయము ప్రతిబింబించు చున్నవి. బహుశా, ఇందులో కొద్దియో గొప్పయో స్వానుభవము కూడ కలదేమో!

బాలికయైన ఇళ చిన్నప్పటినుండి రాధ అదుపు ఆజ్ఞలలో పెరిగినది. ఈడురాని లేత వయసునందే ఇళ యొక్క హృదయమున శృంగార భావాలు మొలకెత్తినవి. రాధ ఆమెను ప్రాణసమానముగా పెంచి పోషించినది. అంతేకాదు, ఆమెను తన సవతియని గూడ మొదలే నిర్ణయించుకొనినది. అయితే సవతియైన తరువాత హృదయములో చెలరేగు ఈర్ష్యాగ్నిమాత్రము ఆమె మొట్టమొదలు ఊహించి యుండ లేదు. రాధా కృష్ణుల శృంగార చేష్టలను అనుదినము అతి శ్రద్ధతో గమనించుచుండిన ఇళ యౌవనము రాకముందే మాధవుని స్వాధీనుని చేసికొనుటలో రాధతో పోటీపడినది. "హరినిగని రాధ అలయాట లాడుదాము" అని పడకటింటికి పిలువగా నేనుకూడ వచ్చెదనని ఇళ పిలువని పేరంటముగా ముందంజవేయును. అంతేకాదు పనిగట్టుకొని పలుమారు ఆ జగజంత శ్రీకృష్ణునితో సయ్యాటలకు సంసిద్ధమగును. దాగిలి మూతల నెపముతో మదనగోపాలునికి పదేపదే యెదురు వచ్చుట, గుజగుజరేకు లాటలలో కదిసి నిలుచుట, వెన్నెల కుప్పలాటలలో కనులు మూయించుకొనుట, గుజ్జెనగూళ్ల ఆటలో చెంగట వసించుట మొదలైనవి వగలాడియైన ఆ బాలిక యొక్క శృంగారచేష్టలు. ఈ చేష్టలన్నింటికి రాధ

సంపూర్ణ ఆమోదము ప్రోత్సాహము లభించినవి. ఎప్పుడే యెమ్మెలాడికి ఈడువచ్చునోయని ఆమె అనుక్షణము యెదురుచూచినది. ఇళ్లకు ఒమ్మగా దిమ్మలై రొమ్ము రావలెనని రాధ కులదేవతలను కోరి కొలిచినది; ఆమెకు మెలుగెక్కి నెఱికురులు పెరుగగా దిన మొకతైలము తెచ్చి యంటినది; కన్నెరికము తొలగగా చెంచులవద్దనుండి తీసికొనిన మందులు యిచ్చినది. ఈ విధముగా ఆమెకు ఈడు వచ్చుటకొరకు రాధ ఎన్నియో దోహదక్రియలు గావించినది; ఆ చెలి సొగసుచూచి "నీవు నా సవతి వౌదువుకదే" అని ముద్దాడి, ఆ శోభనముకొరకు ఉవ్విళ్లు లూరినది.

ఇటువంటి పోషణతోయీ వాతావరణమున పెరిగిన ఇళ యొకనాటి సుముహూర్తమున పుష్పించినది. ఆ శుభమును ముద్దుపళని మోహనాతి మోహనముగా వర్ణించినది. వెంటనే యశోదమ్మకు కబురు గావించినది. పెద్దముత్తైదువైన రోహిణీ దేవిని పిలిచి అవి ఆచిన్నెలో కావో అరసి సత్యము తెలుసుకొన్నది; చుట్టపక్కాలకు శుభపత్రికలు వ్రాసినది; దినశుద్ధి లగ్నము నిరూపించినది; అంటుగలిగినవారిని అంటుకో నియమించినది. ఈ వర్ణనలో అడుగడుగున స్త్రీహృదయము ప్రత్యక్షమగుచున్నది. ఈ సందర్భమున ఆమె ప్రయోగించిన పదజాల మంతయును పడతుల పెదవులమీద ప్రతిదినము తాండవించునట్టిదే. మొత్తముమీద ఒకనాటి శుభముహూర్తమున ఆ ఒయ్యారికి రాధ శోభనము చేయించినది. సంపెంగతైలము అంటి, స్నానము ఆడించి, చెంగావి పావడకొసలు బిగియించి,

ఈ రాధికాసాంత్వనమును నాలుగాశ్వాసాలలో ముద్దు పళని బహు రమ్యముగా వర్ణించినది. కొన్ని సందర్భాలలో శృంగారము కొంత మేర మీరిన మాట సత్యమే. కాని కావ్యమే శృంగార ప్రధానమైనప్పుడు, యీ విషయమై ఆక్షేపణ గావించుటలో ఔచిత్యము లేదు. ఈ శృంగార చిత్రణము నందు ఆమె జూపిన నేర్పునే మనము గమనించ వలసి యున్నది. రసైక దృష్టితో పరిశీలించినప్పుడు మన శృంగార సారస్వతమున ముద్ధు పళని గ్రంథము అతి మనోహర మైనదని ఒప్పుకొనక తప్పదు.

ముద్దు పళని శైలి బహు లలితమైనది. సుందరమైన శబ్దములను సుకుమారముగా యేరి కూర్చుటలో ఆమె అత్యంత చతురురాలు. తెలుగువారి నాలుకల మీద తాండవమాడు సామెతల నెన్నింటినో ఆమె తన పద్యాలలో మిక్కిలి సర సముగా ఉపయోగించు కొన్నది. "తాను బెంచిన పొట్టేలు తనదు చేన సన్నబడు సామ్యము" "ముక్కు పచ్చలు ఆరక మునుపె" "వేలువాచిన ఔలంత విరివియైన, ఔలు వాచిన నది యెంత బోలుగాదు" "దాని వేలుదీసి దానికన్ పొడిచిన యటుల" "అరకాల బెట్టి నేలరాచకున్న" "అల్లునకు కల్మి వచ్చిన అర్థరాత్రి గొడుగు తెమ్మన్న కత" "కొన్నంగడి లోపలనే అన్నన్నా మారు బేర మగునే" "ఈకలోకలోని శ్రీకృష్ణ మాటలు" తగిలెనా తగులును తప్పె నాతప్పును, నాటి వెట్టివాని చేతిరాయి" "గట్టు చేరినంత బుట్టివానికి బొమ్మ గట్టు సామ్యము" "చల్లకై వచ్చి ముంతదాచంగ నేల" "ఎల్ల

వారికి శుభములన్నెల్ల బలికి బల్లి తాబోయి పాలలో బడిన యట్లు" వంటి చక్కని పలుకుబడులు ముద్దు పళని తన కావ్య మున బహు రమ్యముగా ఉపయోగించుకొన్నది. రమణీ మణుల సంభాషణలలోని సొగసులు యీ గ్రంథమున అడుగ డుగున ప్రత్యక్షమగు చున్నవి. విదుషీమణి, కళాప్రవీణ, స్వైరవిహారధీరయైన నెఱజాణ యొక్క రసికహృదయము యీ గ్రంథమునందలి ప్రతి పద్యమునందును ప్రదర్శిత మగు చున్నది. శృంగార ప్రియులైన రసికులకు అత్యంత ఆహ్లాద కరమైన రచన రాధికా సాంత్వనము.

---

# ఆంధ్రోద్యమము - తెలుగు వాఙ్మయము

ఆంధ్ర రాష్ట్ర అవతరణ శుభసందర్భమున "తెలుగు దేశము" నకు నవజీవనము కలుగుట జౌచిత్యముతో కూడు కొనిన సంతోష ప్రదమైన సంఘటన. తెలుగు సీమకు రూపు రేఖలు దిద్దుటకొరకు తెలుగు దేశము ముందడుగు వేయనున్న యీతరుణమున ఆంధ్రోద్యమానికి తెలుగు వాఙ్మయము గావించిన దోహదమునుగూర్చి నాలుగు మాటలు వ్రాయుట అప్రస్తుతము కాజాలదు.

గడచిన నాలుగు దశాబ్దాల ఆంధ్రోద్యమ చరిత్రను ఒక మారు అవలోకించినచో, తెలుగు పత్రికలు మరియు తెలుగు సారస్వతము యీ ఆంధ్రోద్యమానికి బలమైన యూతనిచ్చినట్లు స్పష్టము కాగలదు. అభిప్రాయాల ప్రసారమునకు సారస్వతము మహత్తరమైన సాధనము, కావున సజీవమైన యే ఉద్యమానికైనను తత్ప్రచారము గావించు సారస్వతము పెట్టనికోట. మన జాతీయోద్యమానికి భారత దేశ మందలి బహుభాషలలోని వాఙ్మయము వలన కలిగిన ప్రచారము మరియు బలము మిక్కిలి గొప్పది. "జనగణమన" "వందేమాతరం" "మాకొద్దీ తెల్ల దొరతనము" "దేశమును ప్రేమించుమన్నా" వంటి గేయాలు, మున్షీ ప్రేమచంద్రుని వంటి కథకుల రచనలు, తెలుగులో మాలపల్లి వంటి నవలలు,

స్వరాజ్య రథము మొదలైన నాటకాలు మరాఠా, కేసరి, హరిజన్, యంగ్ ఇండియా, వందేమాతరం, స్వరాజ్య, కృష్ణా మొదలైన పత్రికలలో ప్రకటితమైన వ్యాసాలు, సంపాదకీయాలు, ఇతర వాఙ్మయము భారత దేశములో అపారమైన ప్రబోధము కలుగజేసి, స్వాతంత్ర్యోద్యమానికి గొప్ప బలము చేకూర్చిన సంగతి సుప్రసిద్ధమైనది. నిజానికి ఒక్కొక భాషలో జాతీయోద్యమ ప్రభావ ఫలితముగా నిర్మాణమైన వాఙ్మయమును గూర్చి ఒక్కొక పుస్తకమే వ్రాయుటకు తగినంత సామగ్రి కలదు.

సారస్వతము దేశకాల పరిస్థితుల ప్రభావము నుండి తప్పించుకొన జాలదనుటకు ప్రపంచ వాఙ్మయము ప్రబల నిదర్శనము. ఈ దృక్పథముతో నేటి తెలుగు సారస్వతమును పరిశీలించి నప్పుడు, జాతీయోద్యమ ప్రభావముతో పాటు ఆంధ్రోద్యమ ప్రభావము కూడ గోచరము కాగలదు. ఆంధ్ర చరిత్ర రచన ఆంధ్రోద్యమానికి అత్యంతముగా ఉపకరించినది. ఆంధ్రులు మిక్కిలి ప్రాచీనమైన జాతికి చెందినవారని, వారి ప్రసక్తి ఐతరేయ బ్రాహ్మణము నందుకూడ కలదని, వారికి గొప్ప సంస్కృతి కలదని మన చరిత్ర వెల్లడిజేయు చున్నది. శిల్పము, కళ, సాహిత్యము, విజ్ఞానము మొదలైన రంగాలలో ఆంధ్రులు భారత దేశమున ప్రముఖ స్థానము నాక్రమించు చున్నారని మన చరిత్ర ఉద్ఘాటించు చున్నది. ఈ భావాలు, ఆంధ్రులను ప్రభావితులను గావించుటకు ఎంతయో తోడ్పడినవి. ఆంధ్రులలో ప్రత్యేక రాష్ట్ర వాంఛను, పురిగొల్పుటకు ఆంధ్ర

చరిత్ర మిక్కిలి ఉపకరించినది. ఆంధ్రుల యశోగానము గావించి, వారిని మేలుకొలిపిన కవులు, ఆంధ్రచరిత్రలోని ఉజ్వల ఘట్టాలను సంకీర్తనము గావించినారు. ఆధునిక కవుల రచనలలో ఇందుకు నిదర్శనాలు అసంఖ్యాకములు.

చావలేదు, చావలేదు ఆంధ్రుల మహోజ్వల చరిత్ర యని మనకు జ్ఞప్తికిదెచ్చిన కవీశ్వరుడు తన రచనలద్వారా ఆంధ్రావనిలో అపారమైన ప్రబోధము గావించినాడు. ఆయన పిలుపునందుకొని, ఆధునికాంధ్ర మహాకవులనేకులు ముందుకువచ్చి సోదరాంధ్రులను మేలుకొలిపినారు. వీరి రచనలు బహువేదికలనుండి గానము చేయబడి, తెలుగుసీమలో ఉత్సాహము పురిగొల్పి కర్తవ్య పరాయణత్వమును ప్రబోధించినవి. మా తెలుగు తల్లికి మల్లెపూదండవంటి గేయాలు ఆంధ్ర ప్రజానీకమును ఉత్సాహతరంగితము గావించినవి. కొందరు కవులు ఆంధ్ర ప్రశస్తినిగూర్చి ప్రత్యేకముగా కావ్య సంపుటములను ప్రకటించినారు.

ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రముయొక్క అవసరమును మరికొందరు కవీశ్వరులు తమ రచనలలో ఉద్ఘాటించినారు. ఇట్టి వానిలో "రాష్ట్రగానము"ను ప్రత్యేకముగా పేర్కొనవలసి యున్నది. ఇన్నాళ్లు ఆంధ్రులు "రాష్ట్రములేని పరాభవము"ను "రక్కసతాల్మితో" నోర్చినారని తెలిపి, ఆంధ్రుల హృదయాల ఆవేదన 'రాష్ట్రగాన' కావ్యకర్త ప్రకటించి, కర్తవ్యమును ఉద్బోధించినారు.

హైద్రాబాదు రాష్ట్రములో కూడ ఆంధ్రోద్యమ ప్రభావము మన వాఙ్మయమునందు ప్రస్ఫుటముగా కనపడు చున్నది. ఆంధ్ర మహాసభ వేదికలపైన మన కవీశ్వరులు గానము గావించిన ప్రబోధ కవిత్వము, యీ మహాసభలకు వచ్చిన సభ్యులను, ప్రేక్షకులను, ఉత్తేజితులను గావించి వారిలో చైతన్యము కలుగజేసినది. అన్యభాషా పిశాచి ఎక్కడనుండి మనకు దాపురమైనదని ప్రశ్నించుకొని, "చిన్న తనముననుండి నెచ్చెలిగనున్న తెలుగు కన్నియ ముద్దులు తీర్చుటెపుడు" యని ఆవేదనజెందిన మన యువ కవులు "ఏ భాషరా నీది యేమివేషమురా ,, "ఈ భాష, యీ వేష మేందుకోసమురా" యనియు, ఆంధ్రుడనయి నేనాంధ్రభాషను, మాట్లాడలేననుట క్షమింపరాని అపరాధమనియు ప్రబోధించి నారు. తెలంగాణమున, విశాలాంధ్ర సభల వేదికల నుండి, చక్కని ప్రబోధవాఙ్మయమును గానము చేసిన కవులు కలరు.

హైద్రాబాదులో ఆంధ్రత్వప్రచారమునకు గోలకొండ పత్రికచేసిన, చేయుచున్న సేవ అమోఘమైనది. గోలకొండ, నీలగిరి, తెనుగు, మొదలైన పత్రికలలోని రచనలయందు ఆంధ్రోద్యమ ప్రభావము స్పష్టముగా కనపడుచుండును.

మన అధునిక సారస్వతముపైన ఆంధ్రోద్యమ ప్రభావ మునుగూర్చి స్థాలీపులాకన్యాయముగా చెప్పిన నాలుగు మాట లివి. మన సారస్వత విమర్శకులు యీ దృక్పథముతో మన వాఙ్మయమును సమీక్షించి, కొన్ని ప్రత్యేక వ్యాసము లను వ్రాయవలసిన ఆవశ్యకత కలదు.

# ఆధునిక కవిత్వములో శబ్ద రామణీయకత

దేశ భాషలలో తెలుగు లెస్స; లెస్సయే కాదు మిక్కిలి తీయనిది కూడ. అందుకే కాబోలు ఆధునిక కవులనేకరు తెనుగు పాటల వెంట తీపి ఎడబాయక యుండునని తెలిపినారు. అసలే తీయనిదైన తెలుగుభాష, అందులో కవిత్వము; ఆ కవిత్వములో కూడ ముద్దులు మూటకట్టు రచనయే అయినచో దాని యొక్క రామణీయకతను గూర్చి వేరుగా చెప్పవలసిన పని లేదు. పూర్వ కవులలో కొందరు ప్రత్యేకముగా ముద్దు పలుకులకు వేరుగాంచినారు. ముక్కు తిమ్మన కవిత్వము వీణా కలకలముల కలకల నవ్వుచుండును. ఆధునికులలో కూడ రమణీయ శబ్ద సంపదతో కావ్యరచన కావించిన వారు కనబడుచున్నారు.

శబ్దరామణీయకత అనగా చక్కని పదాలయొక్క సొంపైన కూర్పు. కావ్యమాధుర్యమునకు ఇది చాల అవసరము. మృదువైన భావాలను ప్రకటించుటకు రమణీయమైన శబ్దాలు కావలెను. శబ్దరామణీయకతను నిర్ణయించునది శ్రవణ సుఖము. నవ్యుల రచనలకు ఈ శ్రవణ సుఖము చాల ప్రధానమైనదని తెలుపుచు 'రమ్యాలోకములో'—

"వదలరీ వృత్త పదమృదు బంధమెందు
నవ్యులు రసవద్వాక్య సంధానమందు

సంధులు విసంధులైనను సాంస్కృతములు
దేశ్యములతోడ నమసించి తీవె గొనిన"

అని చెప్పి యున్నారు. చెవికి ఇంపుగాని పదాలు నవ్యులకు రుచించవనికూడ "రమ్యాలోకము" లో తెలిపి యున్నారు. సహజముగానె మధురమైన ఆంధ్రభాషలో కావ్యరచన కావించునపుడు శబ్దరామణీయకతను చక్కగా పోషించవలసిన ఆవశ్యకతను నవ్యాంధ్ర కవులలో ముఖ్యులందరును గమనించి యున్నారు. కావుననే,

"కాళ్ల కడియాలొరయు ఆంధ్రకన్య సొగసు
ద్రావిడీకన్య చరణాల తడవ నేల
కేరళీ, కర్ణతాటంక ఖార కలన
తెగి పడగనోపు తెనుగు ముద్దియల చెవులు." అని

చెప్పి యున్నారు.

రూపచిత్రణము కావించునపుడు, ప్రకృతి విలాసమును ప్రదర్శించునపుడు, కరుణ — శృంగారము మొదలైన మృదు భావాలను వ్యక్తీకరించునపుడు ఆధునిక కవులు ఈ శబ్దరామణీయకతను ప్రత్యేకముగా పాటించియున్నారు. వారు సాధనముగా గ్రహించిన కావ్యస్వరూప మేమైనప్పటికిని, అది ఛందోబద్ధమైనప్పటికిని, కాకపోయినప్పటికిని, అవి గేయాలయినప్పటికిని, వృత్తాలయినప్పటికిని సొంపైన పదాలను ఏరి కూర్చుటలో ఆధునికులు ప్రత్యేకతనుచూపించిన నిదర్శనాలకు

ఎన్నిటినైనను పేర్కొనవచ్చును. సంస్కృత పదాలను, తెనుగు పదాలను గ్రహించి సరసముగా మేళవించుటలో కూడ శబ్దరామణీయకతను పాటించి యున్నారు. కొన్ని సందర్భాలలో ఇతర భాషా పదాల ప్రయోగమునందును ఈ శబ్దరామణీయకత ప్రదర్శితమగు చున్నది. "నాజూకు" "పసందు" వంటి చక్కని పరభాషా పదాలను ఆధునికులు తమ రచనలలో రమణీయముగ ప్రయోగించి యున్నారు.

క్రొత్తపాతల మేలి కలయికయై, తేటైనవాడుక మాటలతో దీప్తి చెందుతున్న "ముత్యాలసరాలు" ఆధునికాంధ్ర కవులనేకులకు మార్గదర్శకమైన ఉజ్వల రచన. అచ్చమైన తెలుగు పదాలలోని అందము ఈ "ముత్యాలసరాల"లో అడుగడుగున కనబడుచున్నది. ఒకానొక కన్యకను వర్ణంచుచు, "తగటు బంగరు చీరకట్టి; కురుల పూవుల సరులు

చుట్టి, నుదటకుంకుమ బొట్టుపెట్టి, తొగలకాంతులు
కనులుపరపగ, మించు తళుకులు నగలు నెరపగ
పసిడి కలువల పాలు పెరుగులు
పళ్లెరమున పళ్లు పూవులు
మోములందున మొలక నవ్వులు" అను వర్ణన

శబ్దరామణీయకతకు చక్కని నిదర్శనము. పూర్ణమ్మ కథను చెప్పుచు,

"మేలిమి బంగరు మెలతల్లారా
కలువల కన్నుల కన్నెల్లారా

తల్లుల గన్న పిల్లల్లారా
ఆటల పాటల పేటికలారా
కమ్మని మాటల బొమ్మల్లారా,, అనున దింకొక
నిదర్శనము.

ఆంధ్రుల యశోగానము గావించు

"విద్యానగర రాజవీధుల కవితకు పెండ్లి పందిళ్లు కప్పించునాడు."
అనురచనలో ఉక్తి వైచిత్ర్యముతోపాటు రమణీయ శబ్ద ప్రయో
గముకూడ కన్పించు చున్నది. ఒక సుందరాంగి యొక్క
మనోహరమైన హాసమును వర్ణించుచు,

"దానిమ్మపూవంటి తరుణి కెమ్మోవి పై
మల్లెపూవుల నవ్వు సుళ్లు తిరుగ'' అని

చెప్పినపుడు కవి ఉపయోగించిన పదములు ఎంత రమణీయ
ములు! తమ ఇంటి వెనుక పూదోటలో నొక మందారము
త్రిజగన్మోహనముగా మొలిచినపుడు చుట్టుపక్కల అమ్మ
లక్కలు వచ్చి చూచిన ఒక సామాన్య దృశ్యమును వర్ణించుచు

"ఇరుగు పొరుగు వధూ జన మరుగు దెంచి
కనుబొమలు వంచి కంకణ రణిత పాణి
తలములం దేల్చి చూచి మందార మనిరి'' అని

చెప్పిన మాటలలోని సొగసు గమనించ దగినది. కాంత కిన్నెర
సాని కదలిక పదువుకట్టిన లేళ్ల కదుపు వలె నున్నదట. కదులు
తెల్లని పూల నదివోలె నున్నదట. వదుల్లు తెల్లని తాచు
పడగవలె విరిసినదట. ఆమె నడువగా నడువగా తోడిమె పూడిన

పూవు పడతివలె దోచినదట. కడు సిగ్గుపడు రాచ కన్నెవలె దోచినదట. బెడగుపోయిన రత్నపేటి వలె దోచినదట. కిన్నెరసాని ప్రవాహము ఆవుపొదుగున పాలు ధారకట్టిన యట్లున్నదట. వనదేవతలు నీళ్ళు వలకపోసిన యట్లున్నదట. తల్లి చల్లని ప్రేమ వెల్లివారినయట్లున్నదట. ఆమెపొంగు ముద్దరాలి మనసు పొంగువలె నున్నదట. పసిపాప సెలివి వారిన బోసి నవ్వువలె నున్నదట. గడియలోపల పెద్దకాల్వగా గట్టిన ఆమెతోగు బంగారు తీగెలో పానకమ్మయి పోయిన దట. కొబ్బరిపాలు వాకలు కట్టి నట్లయ్యెనట. వెయ్యావు లొకసారి పితికినట్లయి పోయెనట. ఆ సందర్భములో కిన్నెర సాని తెలి తారకల వెంట వెలుగు వలె, తలిరి పూవుల వెంట తావివలె తోచినదట. ఆ కిన్నెరసాని ఒయ్యారమునకు తగిన యంత అందముగా నున్నదీ కవిగారుపయోగించిన శబ్ద జాలము. మేఘునికి ఒక పల్లెటూరి రైతు,

"దొంతులు దీర్చి, కానుకలతో నెదురొదుము
బంతిపూలు, చేమంతులు, చంద్రకాంతములు, మంకెన
పూవులు పోకబంతులున్
వింతల గన్నెరుల్ హృదయ వీధుల నాయెడ విశ్రి
మింపుమా
చింతలతోపులో విడిది చేయుము శ్రావణ
మాసవేళలన్.'

అని ఇచ్చు స్వాగతము గ్రామ శోభకే కాక మాటలు సొగసుకు కూడ మంచి నిదర్శనముగా నున్నది.

ఈ కవి వర్యుడే మబ్బుల నెంత మనోహరముగా వర్ణించినాడో చూడుడు.

"కన్నె కాటుక కళ్లు
చిన్ని నాథుని చూచి
కదలు లాడిన వేళ
కందలించిన వేళ

ఆకాశ మధ్యాన అట నొక్క తెలిమబ్బు
మెరపులా మెరసింది లే!
వెలుగులా వారసింది లే!
తొలి చిన్ని చూలాలు
కొల సిగ్గు ప్రేమతో
విభుని చూచిన వేళ
విన్నబోయిన వేళ

బఱపు మిన్నుల లోన ఒక నీలితెర మబ్బు
సంజలా తారిందిలే!
జాలుగా మారిందిలే!
తొలికాన్పు పసిపాప
సాక నేరని బాల
తెలబోయి పతిజూచి
కళవళించిన వేళ

తూరుపు కోనలో తొంగిలించిన మబ్బు
తెగ పరుగు లెత్తిందిలే!
సొగసుల్లు పోయిందిలే!

" తృణకంకణము"లో కాలినడకన బోవుచున్న కాంతయొక్క ఒడలిచాయ పసినిమ్మపండు చాయల కొసరు చున్నదట. ఆమె యొడలి మీద నగలేమి లేకపోయినప్పటికిని జారు చెమ్మట ముత్యాల జంపుసరులు సహజ సౌందర్యమును వెదజల్లు చున్నవి. జిలుగు పూల కలంకారి చీరజార, జిందు సందెడు కుచ్చెళ్లు చెదర నీక మాటికిని కాలు కడియాలు మలపుకొనుచు ఆమె నడచు చున్నది. ఈ నడకలో పదముల యొక్క రామణీయకత ప్రత్యక్షమగు చున్నది.

తెనుగుతోటలో ఆంధ్ర కన్యక అందచందములు అతి రమణీయముగ వర్ణితములైనవి. తెనుగు మీరిన గరువంపు తీరులను తీయని తెనుంగు మాటలలో తెల్పినారీ కవిగారు. అదిఒకానొక ఊరు. ఆ యూరిలో నొకకాపు. ఆ కాపు వానికొక చక్కని కూతురు. ఈ ఘట్టమును కవిగారు ఎంత చక్కగా వర్ణించినారో గమనించుడు.

" ఊరి కావలి చెరువులో
నీరు దెత్తురు నిరతమున్
పౌర భామలు కడవలన్
జారు సందెలు మెరవగన్
చంద్రశేఖరు డెసగునూ
చంద్రుబోలిన యశముతో
పెద్దకాపయి నగరమున్
దిద్దునాతడు చదురుతో
కాసె చక్కగ మెరపలు

పూఁచేనోయన పవడముల్
పూతురొక్కత యతనికిన్
చూతపల్లవ మనదగున్
మంచి గందపు మొలకయో
మించు ముద్దుల గిలకయో
కల్కి చెక్కులు పలుచనై
తళుకు లెక్కిడి మిసమిసన్
వీట భావము కనులలో
మాటలాడును మితముగా
నవ్వ దెక్కువ సఖులతో
రవ్వ పల్వరుసగుపడన్
దోసపిందియ నునుపులన్
భాసిలుఁ సఖిప్రాయముల్
తెల్ల చీరల మురియునూ
నల్ల రైకల దొడుగునూ "

ఈ చిత్రణము యొక్క సౌకుమార్యము పదముల యొక్క లాలిత్యము వలన ద్విగుణీకృత మగు చున్నది.

" కష్టకమల " లో

"అరగ దంచిన సన్న బియ్యంబు వండి
పొట్లకాయల నేతి పోపుల నమర్చి
పేర పెట్టిన మీగడ పెరుగుతోడ "

సిద్ధము చేసిన భోజన మెంత కమ్మనిదో ఆ రుచులను మనకు తెలుపుటకుపయోగించిన పదజాల మంతతీయనిది.

జానపద సుందరియైన ఎంకి చూపుతో మాటాడి ఊపిరితో తెనిగించగల జాణ. ఆమెకళ్లైతి తేచాలు కనకాబి సేకాలు. ఆమె వొక్క నవ్వే యేలు వొజ్జర వైడూరాలు. రాసోరింటికైన రంగు దెచ్చే ఆ ఎంకి యొక్క సెక్కుట సిన్నీ మచ్చను గూర్చి సెపితే సాలదు లచ్చ. ఈ విధముగా జానపదుల మాటలను కూడ బహు రమణీయముగ వరి కూర్చుట జరిగినది.

వివాహ సందర్భములో పెండ్లి కూతురును కనుల కట్టినట్లుగ చిత్రించిన కవిగారు ఆమె లజ్జా దరహాస చంద్రి కలను శాశ్వతముగా నుండునట్లు మధుర మధురమైన మాటలతో

"పునుగు జవాది తావులు గుబులొక్కను
నీ పసుపుం బయంట కొంగున ముడివైచి కొంటిగద
కోమలి, నీమగడింక నెట్లు చెప్పిన నటులే
వినంగలడు, పెండ్లము గీచిన గీటు దాట
డంచును వదినల్ నగన్, జారుకుచూపుల
చూచెదు నీకు సౌఖ్యమా"

అని అపుడినను మన నాలుకల పైన నాట్యము చేయు పదాలను రమణీయముగా నుపయోగించి ఆశీర్వదించి యున్నారు.

ఈయనయే బుద్ధదేవుని సన్న్యాసమును గూర్చి వ్రాసిన పద్యాలలో,

" మొగలి రేకుల మృదుల కపోలయుగము
కరకు టెండల వేడిమి కందువారె,
తెలి మొగిలు చాటు నెలవంక తెరగు బూని
బూది బూసిన నీ మోము మురువు కరిగె"

అని బహు చక్కని పదాలను ఏరి కూర్చినారు.

జాలిమాలిన వేటకానిని జూచి కన్నీళ్లతో కరుణా మూర్తియైన లేడిపిల్ల,

" నేయియు పాయసమ్ము దిన నేర్చిన
పెద్దల పాద సేవలన్ జేయగ రాదె
నీకుగల చెడ్డ తనంబొక కొంతమాను
స్వర్గీయలతా నికుంజముల కిన్నెర సానులు
పోవుదారులన్ బోయెదనింక నాకు
సెలవుం దయచేసి కుడిదండ్యజింపుమా"

అని కడుసున్నితముగా చెప్పినప్పుడు ప్రపంచమునకు శాంతి సందేశము నిచ్చుట రమణీయముగా ధ్వనించు చున్నది.

' నిండు పున్నమనాటికి నీటుకాడు కళలు పదియారు నేరిచి గర్వపడునని, నెల బాలుని గూర్చి భావించిన కవి కోకిల, చిన్నారి శిశువు యొక్క చిత్రమును ఎంత మనోహర ముగా మనముందుంచినారో గమనించుడు,

" గానమాలింపక కన్ను మూయనిరాజి
అంబ కౌగిట పంజరంబు చిలుక
కొదమ కండలు దేరు కొనుపిల్ల వస్తాదు
యుయ్యేల దిగని భాగ్యోన్నతుండు
ఊ ఊలు నేర్చిన యొక వింత చదువరి
సతిని ముట్టని నాటి సాంబమూర్తి
ప్రసవాబ్ధి తరియించి వచ్చిన పరదేశి
తన యింటి క్రొత్త పెత్తనపు దారి

ఏమి పనిమీద భూమికి నేగినాడొ,
నడవ నేర్చిన పిమ్మట నడుగ వలయు
నేండ్లు గడచిన ముందు ముందేమొ గాని
యిప్పటికి మాత్రమే పాప మెరుగడితడు."

ఈ కవికోకిల రచించిన ప్రతి పద్యమందు ఇటువంటి భాషా సౌకుమార్యము బహుళముగా కన్పించు చుండును.

ఈ శబ్దరామణీయకత ఆధునికుల శిష్ట వ్యావహారిక రచనలలో కూడ కన్పించుచున్నది. సంస్కృత పద బహుళ మైన రచనల యందును కన్పించు చున్నది. హృదయేశ్వరి వంటి కావ్యాలలో లలిత సంస్కృతపద రామణీయకత అడు గడుగున ప్రత్యక్షమగు చుండును. హృదయేశ్వరి యొక్క కాంత మనోజ్ఞ రూపమును వర్ణించుచు "తిలక పాటలఫాల మండల దీప్తి జాలమును" "కలిత కాంచనహార విలసత్కంఠ దేశమును" "కటక కంకణరుచిర కరసరోజముల"ను వర్ణించు

టలో నుపయోగించిన సంస్కృత పదములు మిక్కిలి రమణీయములు. ఇటువంటి రామణీయకత ఈ కవిగారి పద్మావతీ చరణ చక్రవర్తి మొదలైన కావ్యాలలో సమృద్ధముగా కన్పించు చుండును. మరొక ఆధునిక కవీశ్వరుడు వెన్నెల రాత్రిని "పవన పులకిత చంద్రాతప ప్రఫుల్ల చారు శారద యామినీ సమయము"ని సరసముగా సాక్షాత్కరింప చేసినాడు. తిక్కన కవిత్వమును కీర్తించుచు,

"పూజాతి సాంద్ర కర్పూరమ్ము లందు
పారిజ్ఞాదిపాథోలవమ్ముల యందు

మడగు సన్నని పాట
పాడుచు వెన్నెల తేట

కలవు తిక్కన పల్కు తెలుగు పల్కులకు
లోల మృద్వీకాగుళుచ్ఛ మాధురియు
నవ పుష్య రాగ సుందర పటిష్ఠతయు

అలరు మల్లియ పువ్వు
నందు పిన్నని నవ్వు

కలవు తిక్కన పల్కు తెల్గు పల్కులకు"

అని చెప్పిన సందర్భములో సంస్కృతాంధ్రముల యొక్క సొగసు చక్కగా వ్యక్తమగు చున్నది. ఇంకొక ఆధునిక కవి తోడి కవుల నుద్దేశించి,

"లే లెమ్మా కవిరాజ లీలా విహార
శైల కుంజలతాంత శయ్యపై నుండి
రా రమ్మా కవిరాజ రతిరాజకీర
శారికా సార సంసార మందుండి
కూజత్వి కాంగనా గోష్ఠి చాలించి"

అని పలికిన పలుకులు శబ్దరామణీయకతకు మరొక మచ్చు తునక. ఆధునికుల రచనల నుండి ఇట్టి నిదర్శనముల నెన్నైన చూపించ వచ్చును. శబ్దరామణీయకత కొరకు వ్యాకరణమును ఉల్లంఘించి అలంకార శాస్త్రమును ధిక్కరించి తుదకు అర్థగౌరవమును గూడ అంతగా పాటింపని నిదర్శనాలను కూడ కొన్నింటిని మనము చూప వచ్చును. గ్రంథములకు నామకరణము కావించుటలో కూడ శబ్ద రామణీయకతే యందలి ప్రీతి కాన్పించు చున్నది. పూర్వము ముక్కు తిమ్మన వలె ఈ కాలమున కూడ ముద్దు పలుకును ప్రేమించి పోషించిన మధుర కవులు కన్పించు చున్నారు. గౌతమీ తీరమున నివసించి మధురకవి బిరుదాంకితుడైన కవివర్యుడు తీయని పదములను చక్కని తేట గీతులలో ఏరి కూర్చిన తన గ్రంథములకు "మీగడ తరగలు" "వెన్నెల బుడగలు" "గోరు ముద్దలు" వంటి మనోహరమైన పేర్లను పెట్టుకొన్నారు. తమ కవిత్వము యొక్క సొగసును తెలుపుచు, ఒక కవి

"గుమ్మ పాలల్లోని గోరెచ్చదనము
అరటి పువ్వుల్లోని అందంపు సిగ్గు

పరుగెత్తు పినలేడి పరువంపు శైలి
బీరపూవుల వోలె విచ్చు భావాల" తో కూడి

యుండునని చెప్పి నపుడు పింగళి సూరన యొక్క రచన జ్ఞప్తికి వచ్చు చున్నది.

ఈ శతాబ్దాది నుండి గడిచిన దశాబ్దము వరకు వ్రాసిన నవ్య కవులలో శబ్దరామణీయకత మీాది ప్రీతి ఎక్కువగా గన్పట్టు చున్నది. భావ సౌందర్యముతో పాటు భాషా సౌకుమార్యమునకు నవ్య కవులు (తమ కవితా స్వరూపమేమై నప్పటికి) ప్రత్యేక ప్రాధాన్యత ఇచ్చినారు. గడచిన పది సంవత్సరాల రచనలను పరిశీలించి నపుడు ఈ నాటి కవులకు శబ్దరామణీయకత మీాది ప్రీతి సన్నగిల్లి, పదప్రయోగమును గూర్చిన పట్టుదల సడలు చున్నట్లు తోచుచున్నది. భావములకు తగినంత భాషా పుష్టి ఇటీవలి రచనలలో లోపించు చున్నదేమో యను అనుమానము కూడ కలుగు చున్నది.

